


శ్రీ కపిలేశ్వరపురాధినాయక ప్రకటితము.

# సుగ్రీవవిజయము.

కందుకూరి రుద్రకవి

కృతము.




శ్రీ కపిలేశ్వరపురాధినాయక ప్రకటితము

# సుగ్రీవవిజయము.

# సుగ్రీవవిజయము.

(యక్షగానము)

వెల 0-4-0.

కవి

కందుకూరి రుద్రకవి

కృతము.

# విజ్ఞాపనము.



అముద్రితప్రాచీనాంధ్రప్రబంధములను, ఇంపయిన వానిని, గొన్నింటినేని, ప్రకటింపవలయునను కుతూహలముతో రాధామాధవ మను పద్యకావ్యము నిదివరలో ముద్రింపించి ప్రచురించియున్నాఁడను. ఇది రెండవది. నిరంకుశోపాఖ్యాన మను ప్రబంధరాజమును రచించిన కందుకూరి రుద్రయకవి యీకృతికి కర్త. ఇది యక్షగానములలో నుత్తమమైనది.

యక్షగానముల పుట్టుపూర్వోత్తరములను, వాని ప్రాశస్త్యమును విశదీకరించుచు, ఈగ్రంథమునకు, పీఠిక వ్రాసి యొసంగిన బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి కెంతయుఁ గృతజ్ఞుఁడను.

కృత్రిమమణులయందేకాని, నిజరత్నములయం దాదరము తక్కువయయిన యీకాలమున ప్రశస్తప్రబంధములను బ్రకటించుట కష్టమగుటయేగాక, నిష్ప్రయోజనమేమో యని కూడ తోచుచుండును.

రసగ్రహణ పారీణులు కొలదిమంది యానందించినను, జాలునను నుద్దేశముతోడను, నిజరత్నముల కెప్పుడయినను

ఆదరము లభింపకపోదను నాశతోను, ఇంకను గొన్నిపొత్తములను ఆంధ్రపాఠకలోకమున కందింపవలయునని యత్నించుచు నాయుద్యమమునకు జేయూతనొసంగ భగవంతుని పాఠకలోకమును వేఁడుకొనుచున్నాఁడను.

| | |
|---|---|
| కపిలేశ్వరపురము,<br>ప్రమాధి, ఆషాఢ<br>మాస ప్రథమదివసము | శ్రీ బలుసు బుచ్చిసర్వారాయఁడు<br>జమీందారు. |

# పీఠిక.

## మధురకవితలు.

ప్రాచీనాంధ్రలక్షణకర్తలు తెలుఁగుఁగవిత్వమును 'ఆశు, మధుర, చిత్ర, విస్తరము' లనుపేళ్లఁ జతుర్విధముల విభజించిరి. యక్షగానాదు లందులో మధురకవిత్వమునఁ జేరును.

"మధురకవిత్వంబన్నది నాటకాలంకారంబులు, కళికోత్కళికలు, విభక్త్యర్థదేవతోదాహరణములు, సప్తతాళనటనలు, నట్టొర్లు, గీతప్రబంధంబులు, చతుర్భద్రికాష్టభద్రికలు, బిరుదావళి, నామావళి, భోగావళి, రంగఘోష, జయఘోష, త్యాగఘోష, చతురుత్తరసంఘటనలు, యక్షగానంబునవెలయు పదంబులు, దరువులు, సేలలు, ధవళంబులు, మంగళహారతులు, శోభనంబులు, నుయ్యాలజోలలు, జక్కులరేకుపదంబులు. చందమామసుద్దులు, అష్టకంబులు, ఏకపదద్విపదత్రిపద చతుష్పదాష్టపదలు నివి యాదిగాఁగల్గు నన్నియు."

— లక్షణదీపిక.

మధురకవితలు ప్రాయికముగా భాష, భావము, ఛందము దేసిగా నుండుటచే సంగీతసంస్కారము గలిగిన సామాన్యజనుల నాలుకలమీఁద నాట్యమాడునవిగా నుండును, గాన

తొలుత నవియంతగా లిపికెక్కకపోయెను. సంస్కృతప్రాయా రచనలుగల చిత్రవిస్తరకవితల ప్రాబల్యమునఁ గూడ వానికి సత్కవితలలోఁ బరిగణన మంతగా లేకపోయెను. ఇటీవల కవులుగా పురాణప్రబంధరచయితలే పరిగణింపఁబడుచుండిరి గాని మధురకవితారచయితలు లెక్కకెక్కకున్నారు. ఆంధ్రవాఙ్మయవృక్షమున ముఖ్యమయిన మధురకవితాశాఖ యిందాఁక సుపరిశీలనము లేకయే యున్నది. ఇక్కడ నాకిప్పుడు దేసి నాటకము లనఁదగిన యక్షగాన రచనముల ప్రశంసయే ప్రసక్తమగుటచే వాని పుట్టుపూర్వోత్తరములఁ గూర్చి మాత్రమే నాకుఁగోచరించిన విషయములఁగొన్నింటి వివరింతును.

దేశిదృశ్యరచనలు.

యక్షగానము లన్న పేరుగల దృశ్యరచనములు నన్నయాదుల కాలమున నున్నవనుటకుఁ బ్రబలాధారములు గానరావు; కాని యానాఁడేవో కొన్ని దేశిదృశ్య రచనము లున్నవని మాత్రము గుర్తింపనగును. నన్నయ కిన్నూఱేండ్లకుఁ దర్వాత నున్న పాల్కురికి సోమనాథుఁ డిట్లు చెప్పినాఁడు:

"భ్రమరులు జాళెముల్ బయనముల్ మెఱసి
రమణఁ బంచాంగపేరణి యాడువారు
ప్రమథపురాతన పటుచరిత్రములు
క్రమమొంద బహునాటకము లాడువారు
లలితాంగ రసకళాలంకారరేఖ

లలవడ బహురూప మాడెడువారు

* * * *

అమరాంగనలు దివి నాడెడు మాడ్కి-
నమరంగ గడలపైఁ నాడెడువారు
ఆవియద్గతి యక్షులాడెడు నట్టి
భావన మ్రోకులపై నాడువారు
భారతాది కథలు చీరమఱుఁగుల
నారంగ బొమ్మల నాడించువారు
కడు నద్భుతంబుగఁ గంభసూత్రంబు
లడరంగ బొమ్మల నాడించువారు
నాదట గంధర్వ యక్షవిద్యాధ
రాదులై పాత్రల నాడించువారు

పర్వతప్రకరణము—పండితారాధ్యచరిత్రము.

పై ద్విపదలందు, నేటివీథినాటకములు, బొమ్మలాటలు, తోలుబొమ్మలాటలు మొదలగునవి పేర్కొనఁబడినవి. ఇట్టి సంప్రదాయములు వీనిఁ బేర్కొన్న సోమనాథుని కిన్నూఱేండ్ల పూర్వకాలమునఁగూడ నుండుట సంభావ్యమే. తెలుఁగునకు సాటిభాషలగు ద్రవిడ కర్ణాటభాషల పద్ధతులను బట్టియుఁ దెలుఁగులో నిప్పు డుపలభ్యమానము లగుచున్న కొన్ని ప్రాచీన దృశ్యరచనములతీరులను బట్టియు, ద్రావిడభాషా సామాన్యముగాఁ దొలుత వెలసిన నాటకరచనలస్వరూపము కొంత గుర్తింపవచ్చును.

## కురవంజి [1]

తొలుత ద్రావిడభాషలలో వెలసిన దృశ్యరచనములు కురవంజు లనఁబడునవి. ఆంధ్రకర్ణాట ద్రవిడదేశముల యరణ్యములలో వసించు నాటవికులు, చెంచులు, కురవలు (క్రోవ, కోయ) అనువారు. అందు కురవజాతివారి యంజె=అడుగు (నృత్యవిశేషము) కురవంజె యనఁబడెను. చిందు, గంతు, గొండ్లి, అంజె, అంగ-ఇత్యాదులు నృత్యవిశేషములు. ఆంధ్రదేశమున బహుకాలమున నుండి శివక్షేత్రములగు శ్రీశైలము ఇంద్రకీలనగము (బెజవాడకొండ) మొదలగు పర్వతముల మీఁదను, నృసింహక్షేత్రములగు వేదాద్రులు (పెక్కు లున్నవి. మంగళాద్రి, సింహాద్రి, గరుడాద్రి, మాల్యాద్రి,

1. వాల్యిచి గుజ్జరి విర్వేడు (?) దండలా
స్యము కందుకక్రీడ యల్లికయును
కొరవంజి (జె) శుభలీల గుజరాతి దేసి చౌ
పదము జక్కిణి దురుపదము మదన
పదదౌత్యమును జోగిపదచాళి శారదా
సామ్రాజ్యమును జిందు సవతిమచ్చ
రంబులు నాట్యకదంబంబు మొదలైన
నాట్యముల్ హావణించు నవరసజ్ఞ

(విజ.ను రాఘవన్నపాలుని ప్రహ్లాదచరిత్ర—యక్షగానము) ఇందు 'కొరవంజి' నృత్యవిశేషముగానే పేర్కొనఁబడినది.

2. కురవంజి, కురవ + అంజె (అంజ, అంజె, అంజియరూపాంతరములు) కురవంజియ కురవంజెల నుండి కురవంజి అనురూప మేర్పడి యుండవచ్చును.

వెంకటాద్రి,) మొదలగు పర్వతములమీఁదను వర్షోత్సవములు (యాత్రలు, జాత్రలు, జాతరలు) జరుగునప్పు డక్కడికి నాగరక ప్రజలు చేరుచుండువారు. వారి వినోదమునకై యక్కడి యాటవికులు, రాత్రులందు నృత్యవిశేషములు నెఱపి ధనార్జనము చేయుచుండువారు. అక్కడక్కడి కొరవజాతుల వారు చేయునృత్యములు కొరవంజు లనఁబడెను. కొరవంజి యన్న పేరు తొలుత వారి నృత్యమునకును, పిదప నృత్యవిశిష్టమయిన వారి చిన్నిచిన్ని గేయరచనలకును, నాపై కురవజాతివారికిని, గూడఁ బేరైనది. కురవజాతివారు తొలుతచేయునృత్య విశేషము కాలక్రమమున నాయాపర్వతప్రదేశముల స్థలమాహాత్మ్యకథల తోను, శివవిష్ణులీలా కథలతోను మిళితములయి గేయ విశిష్ట నాట్యరూపములను బడసెను. అపుడు, మాయాకిరాత వేషులగు పార్వతీశివుల కథలతోనున్న కిరాతార్జునీయము, నృసింహస్వామి చెంచీతను బెండ్లాడు స్థలమాహాత్మ్య కథలు (చెంచీతకథ) కురవంజులుగా వెలసెను. ఇట్లు వెలసిన యాదృశ్య రచనములు తొలుత నత్యల్పముగా గేయభాగములును విశేషముగా నృత్యమును గలవైయుండెను. అవి సింగి, సింగఁడు- అని యిద్దఱు పాత్రములు గలవై సంస్కృతవీథీ నాటకములఁబోలి యున్నవి. సింగి, సింగఁడు సంస్కృత నాటకములలోని నటీనటులవలె నాలుమగండ్రు. వీరిద్దఱే కథాపాత్రము లగుచుందురు. కొన్నింట కథాసంధాయకుఁడు- సంధివచనములఁ జెప్పువాఁడు

విదూషకుఁ డనఁదగినవాఁడు- మూఁడవపాత్రము - కోణంగి యనువాఁడు-[1] (పిదప చోడిగాఁడు) కాన నగును. కోణంగి సంస్కృత నాటకములలోని విదూషకస్థానీయుఁడగుట స్పష్టముగా గానవచ్చును. సంస్కృతనాటకములలోని ధ్రువాగానమే కురవంజులలో దరు వనఁబడెను. దేశిరచనలలోనుండి సింగి, సింగఁడు, కోణంగి, దరువు అనునవి నటీనటులుగను విదూషకుఁడుగను ధ్రువగను సంస్కృత నాటకములఁ జేరెనేమోయనికూడ యోచింపఁదగినట్లున్నది. ఎంతోకాలమిట్లు కొండపట్టులందు సాఁగుచుఁ బెంపొందిన గేయనృత్య సందర్భములు నగరములకు గూడఁ గ్రమముగా వ్యాపించినవి. చెంచులు, కురవలు అడవులనుండి పులిగోళ్లు అడవిపందికోఱలు, అడవిపండ్లు, వెదురుబియ్యము, వెదురుబెత్తములు, పిల్లనగ్రోవులు, సూదంటురాళ్లు, ఓషధులు, తేనె మొదలగు నాటవికవస్తువులను నగరములకు గొనివచ్చి అమ్ముచు నప్పుడప్పుడు తమ గేయనృత్యవిశేషములను నగరములందును, పల్లెలందును బ్రయోగించుటచే నవి నాగరికదేశములందును వ్యాపించెను.

## యక్షగానములు

ఇట్లు నగరములందు నభిరుచిగొల్పిన యాగేయవిశిష్టనృత్యదృశ్యములు, జక్కులవారు (యక్షులు, కళావంతులు) తర్వాత నగరములందును బ్రయోగింపఁజొచ్చిరి. వీరి ప్రయోగములందు దృశ్యమయిన నృత్యాభినయములతోపాటుగా నధికము

గా గేయ వచనరూపమైన శ్రవ్యరచనముగూడఁ జేరెను. కురవంజులకంటె యక్షగానములు పర్యాప్తముగా శ్రవ్యములగు కవిరచనములు గలవి. వీరిరచనములలో బహువిధములగు పురాణకథ లెల్లఁ జేరినవి. కురవంజులలోని సింగి, సింగఁడు పాత్రలు మాఱి రామ నల హరిశ్చంద్ర సీతా దమయంతీ చంద్రమత్యాది పాత్రలు వచ్చినవి. కాని వీనిలో నాటవికరచనాసంస్కారసూచకముగా, 'ఎఱుకతసాని' పాత్రము వెలసినది. కురవంజులలోని దేసిరచనలకంటె నత్యధికముగా వీనిలో దేసిచ్ఛందోబద్ధములగు గేయరచనలు ప్రబలినవి. రాజసభలలో, దేవోత్సవములలో, ఊరిజాత్రలలో యక్షగంధర్వాదివేషములధరించి [1]వేశ్యలు ప్రదర్శించునవి గావునను, నృత్యధర్మములకంటె గేయధర్మములధికముగాఁ గలవి కావునను నివి యక్షగానము లనఁబడెను. కళావంతులలో నొకతెగకు నేఁడు జక్కులవారను పేరుగలదు.

---

1. శ్రీనాథుఁడు భీమఖండమున దాక్షారామభీమేశ్వర మహోత్సవసమయములందు సానులు (వేశ్యలు) వేషములు వేసికొని నాటకములాడుట నిట్లు వర్ణించెను.

సీ. విరులదండలతోడి వేణికాభారంబు
పొంకంబు పిఱుఁదుల బోరలియాడ
మణి తులాకోటి కోమల ఝణత్కారంబు
రవలి మట్టెలమ్రోత యవఘళింపఁ
గుదురునిండిన చిన్ని గుబ్బచన్నులమీఁద
ముత్యాలతిసరంబు మురువుఁ జూప

యక్షాది వేషముల ధరించి నృత్యగాన ప్రదర్శనములను గావించుటచేతనే వారి కాపేరు వచ్చియుండవచ్చును. శ్రీనాథుఁడు క్రీడాభిరామమున జక్కులవారిని గూర్చి కొంత ప్రశంస నెఱపినాఁడు.

సీ. కోణాగ్ర సంఘర్ష ఘుమఘుమధ్వని తార
కంఠస్వరంబుతో గారవింప
మసిబొగ్గు బోనాన నసలుకొల్పినకన్ను
గొనబుచేఁ దాటించు నెడప దడప
శ్రుతికి నుత్కర్షంబుఁ జూపంగ వలయుచోఁ
జెవిత్రాడు బిగియించు జీవగఱ్ఱ
గిల్కు గిల్కున మ్రోయు కింకిణీ గుచ్ఛంబు
తాళమానంబుతో మేళవింప

---

వలమాన తాటంక వజ్రాంకురచ్ఛాయ
లేఁత వెన్నెలఁ బుక్కిలించియుమియ
పాని యాశానియై మహోత్సవమునందుఁ
గేల నవచంద్ర కాంతపు గిన్నెపూని
వీథి భిక్షాటనమొనర్చు వేళఁజేయు
మరులునృత్యంబు జగముల మరులు గొలుపు. ఆ. ౧. ౧౦౫.

వ. మహోత్సవమండపమునందుఁ బేరోలగంబుండి, కుండలీదండలాసక ప్రేరణీ ప్రేంకణసింధుకందక ధమాళి చేల మత్తల్లి హల్లీసకాది నృత్యంబు లవలోకించుచు. ఆ. ౨. ౧౧౮.

శ్రీనాథుని కాలమునకే దేవోత్సవాదులయందు వేశ్యలు వేషములు కట్టి నాటకములప్రదర్శించు సంప్రదాయము ప్రబలినది.

రాగమునుండి లంఘించు రాగమునను
నురుమ యూరుద్వయంబుపై నొత్తిగిల్ల
కామవల్లీమహాలక్ష్మి కైటభారి
వలపు వాడుచువచ్చె జక్కులపురంధ్రి.

అప్పకవి యక్షగాన లక్షణము నిట్లు చెప్పినాడు:-

సీ. తుద నేడులఘువులు తొలఁగించి చదివినఁ
త్రిపుటకు వృషభగతిపదయుగము
లలిఁ గడపల నొక్కలఘువు మానిన జంపె
మను ద్విరదగతిసమపదయుగము
గురుతగు రచ్చెరకుఁ దురగవల్గనా
హ్వయము మేకతాళి యాను ఘురగతికి (?)
సంక్షిప్తి నాలు గటతాళమున మాత్ర
లోలి విశ్రాంతి పద్యాలుగింటఁ
దెలియ నర్థంబు నర్ధచంద్రికలు వీలు
యక్షగానప్రబంధంబు లమరకవచ్చు
రగడభేదంబు లివియంత్రు రసఁ గవీంద్రు
లవిత నిజసేవకస్తోమ, యబ్ధిధామ.

పై పద్యమునుబట్టి చూడఁగా యక్షగానములందలి ప్రధానగేయరచనములు దేశిరచనలగు రగడలలోఁ గొంతమార్పు జరిపి- త్రిపుట, జంపె, ఏక, అట, అను తాళముల కనుగుణముగాఁ గల్పింపఁబడినవిగాఁ గానవచ్చును. అప్పకవి రగడవికారరచ

నములను తాళములపేరనే పేర్కొనెనుగానివానికిపేరులు వేఱె తెలుపలేదు. అప్పకవి పేర్కొన్న యీరచనములే కాక యక్షగానములలో నింకను ననేకవిధములయిన దేశిరచనములు చేరినవి. ఏలలు, జోలలు, సువ్వాలలు, ఆరతులు, ధవళములు, చందమామ సుద్దులు, వెన్నెలపదములు, విరాళిపదములు తుమ్మెదపదములు గొబ్బిపదములు, కోవెలపదములు, చిలుకపదములు, అల్లోనేరెళ్ళు, సీస- కందార్థములు, త్రిభంగులు ద్విపదలు, త్రిపదలు, చౌపదలు, షట్పదలు, మంజరులు, జక్కులరేకులు - మొదలగునవి—

యక్షగానము లిట్లు వెలసినను ప్రాచీనములయిన కురవంజరచనములును యక్షగానరచనావిధానసంకలితములై ఈకాలమున గూడఁ గొన్నిసాఁగుచునే వచ్చినవి. దేవోత్సవరాజాస్థానాదులం దిట్లు వేశ్యలచేఁ బ్రదర్శింపఁ బడుచున్న యక్షగానములు పెంపొందుచుండు నీకాలమున, దక్షిణదేశమున విజయనగరరాజ్యమున కుపశాఖలుగా తంజావూరు మధురరాజ్యము లాంధ్రనాయకరాజుల పరిపాలనమున వెలసినవి. ఆంధ్రదేశమునందును, దక్షిణదేశమునందును, ఈకాలమున యక్షగానరచనము మిక్కిలి ప్రబలఁ జొచ్చెను.ఇవి యిట్లు కలావతులచేతఁ బ్రదర్శింపఁబడుచున్నవౌట గొఅంతగాఁ గనిపట్టియో యేమోకాని, కృష్ణాతీరమునందలి కూచిపూఁడిగ్రామమున సిద్ధేంద్రుఁడను యోగియొకఁడు భాగవతకథలను పారి

జాతము, గొల్లకలాపము మొదలగుపేళ్ళతో యక్షగానము లుగా రచియించి శాస్త్రీయమయిన భరతనాట్య సంప్రదాయ ములకు రక్షగా, స్త్రీనిస్సహాయముగా, నాయూరిబ్రాహ్మణుల చేతనే ప్రదర్శనము చేయింప నేర్పాటుచేసెను. ఆయూర జన్మిం చిన బ్రాహ్మణుఁ డెవ్వఁడుగాని, ఒక్కతూరి యైనను, యక్షగా న ప్రదర్శనమున స్త్రీవేషమును ధరించి తీరవలెననియు, అది వారి కులాభ్యుదయహేతువనియు కూడ శాసించెనట. నేఁడు కూడ కూచిపూఁడి బ్రాహ్మణులు శాస్త్రీయమయిన భరత నాట్యముతో భాగవతకథలను ప్రదర్శించువారుగా నున్నారు. ఈసంప్రదాయము వెలసినపిదపనే తత్ప్రదర్శకులకు భాగవ తులనియు, తద్రచనములకు ఆటభాగవతములనియుఁబేరయ్యెను.

ఆటభాగవతములు.

ఈ భాగవతకథలలో పారిజాతహరణకథ హృద్యతర మగుటచే దానికిఁ బ్రచారమెక్కువయ్యెను. అది హృద్యతర మగుట కందలి సవతులకయ్యపుఁబట్టు ప్రధానకారణము. దీని నిఁబట్టి యక్షగాన సామాన్యమునకుఁ బారిజాతము లనియుఁ బేరయ్యెను. ఏయక్షగానముఁ బ్రదర్శించినను అందు సవతుల కయ్యపుఁ బట్టునకుఁబ్రసక్తి గల్పించుటయో, లేక, పారిజాత మునందలి తత్కథాఖండమునే స్వతంత్రముగాఁ బ్రదర్శించు టయో పిదప నేర్పడెను. ఈసవతులకయ్యపుకథపట్టు హృద్య తరమగుటచేఁ బ్రబంధకవులను గూడ నిదివలపించెను. కళా

పూర్ణోదయమున పింగళి సూరన్న పారిజాత కథలోని సవతుల కయ్యపుం బట్టు ని ట్లనుకరించెను.

అంతమదింపకువే యనిపల్కిన నంతమదింపకువే యనుచున్
గంతులడంచెద లెమ్మనిపల్కిన గంతులడంచెద లెమ్మనుచున్
రంతుల నేమిఫలంబని పల్కిన రంతుల నేమిఫలంబనుచున్
బంతముచూడఁగ దేయనిపల్కినఁ బంతముచూడఁగ దేయనుచున్.

సీ. బట్టుసుమీయన్న నొట్టుసుమీయంచు
నేమేమియనిన నేమేమియనుచుఁ
గానీగదేయన్నఁ గానీగదేయంచు
నింకేలయనిన నింకేలయనుచు
నోసిపోవేయన్న నోసిపోవేయంచు
నౌనంటివనిన నౌనంటివనుచు
మఱువకుమిదియన్న మఱువకుమిదియంచు
నీవెంతయనిన నీవెంతయనుచు

నొకతెమగనికి నాసించు టొప్పదనిన
నొకతెమగనికి నాసించు టొప్పదనుచుఁ
బట్టెయాడె నారంభతోఁ బ్రథమరంభ
ప్రియుఁడు నిలుమన్న నిలువక పెద్దరొదగ.

కళా. ఆ. 3—౧౯౫, ౧౯౬.

ఆంధ్రదేశమున వెలసిన యీకూచిపూడిభాగవతముల ప్రయోగవైశారద్యము దక్షిణదేశమునకుఁ గూడ వ్యాపించిన

డి. ఆనాఁడు కూచిపూఁడి భాగవతుల యాటభాగవతసంప్రదాయము నేఁటికిని దక్షిణదేశమునఁగలదు. దక్షిణదేశమున బ్రాహ్మణులు పురుషులే నేఁడును భాగవతయక్షగానములను వెలుఁగువానినే ప్రదర్శింతురు. ఆంధ్రదేశమున వెలసినయక్షగానములిన్నూటికిఁ బై చిలుకు పరిగణింపఁబడినవి. వీని ననుసరించి వెలసిన దక్షిణదేశపు యక్షగానములు మున్నూటికిఁ బై చిలుకుగలవు. భక్తాగ్రేసరుఁ డనఁబడిన శివనారాయణ తీర్థులవారు (కృష్ణలీలా తరంగిణికర్త) త్యాగరాజస్వామివారు పారిజాతాపహరణమని, నౌకాచరితమని భక్తిరసభరితములయినయక్షగానములను రచించిరి. భగవత్కథలతోఁ బురాణకథలతోఁ బెంపువెలసినయీ భాగవత యక్షగానములు తత్ప్రదర్శనములు నాయకరాజుల కాలముననూ, మహారాష్ట్రరాజులకాలముననుమితిమీఱి యాయారాజుల శృంగారజీవితవర్ణనాత్మకములుగాఁ గూడ రచితములై ప్రదర్శితములగుచు వచ్చినవి. దిక్ప్రదర్శనలుగా కొన్నికురవంజులను యక్షగానములను భాగవతములను, బేర్కొనుచున్నాను.

"కిరాతార్జునీయము, శ్రీగిరికురవంజి, గంగాగౌరీవిలాసము, అలమేలు మంగావిలాసము, ఎఱుకలవేషకథ, కపోతవాక్యము, గరుడాచలము, త్రిపురసంహారము, దారువనక్రీడ, నలచరిత్ర, నిజలింగచిక్కయ్యకథ, కన్యకాచరిత్ర, పారిజాతాపహరణము, పార్వతీపరిణయము, మృత్యుంజయవిలాసము, శివ

పారిజాతము, సముద్రమథనము, విజయరాఘవ చంద్రికా విహారము, రఘునాథనాయకాభ్యుదయము.—"

భిన్నపాత్రవేషధారణము లేక సింగి, సింగఁడు (కొన్నిం ట కోణంగికూడ) పాత్రలతో వెలసిన. వీథినాటకములనఁబడు కురవంజులు యక్షగానరూపమునఁ బెంపొందినపుడు వేషభేద ముగల పాత్రభేదములును బెంపొందెను. ఇట్లు పాత్రిబాహుళ్య ముకూడ గలవైన యక్షగానములందు సంధివచనములఁ జెప్పు కోణంగి, లేక, సూత్రధారుఁడు, 'వచ్చెనమ్మా సత్యభామ-' ఇత్యాదివిధములను, 'అంతట హనుమంతుఁ డేమనుచున్నాఁడు' ఇత్యాది విధములను, బాత్రములఁ బేర్కొనఁగా, తద్వేష ధారులు వచ్చి తమయాటపాటలు నెఱపుదురు. ఇట్లింకను పెం పొందిన యక్షగానములు తెరలు, రంగభేదములు కలవయికొం తసంస్కృత నాటకచ్ఛాయయుఁ జొప్పడఁగా నాటకములను పేరను గూడఁ బదునెనిమిదవ శతాబ్దినాఁటికిఁ బేర్వోలసినవి.

ఇంచుమించుగాఁ దెలుఁగున నేనూఱింటిదాఁక లెక్కింపఁదగియున్న యక్షగానములలో సుగ్రీవవిజయ మొక ప్రశస్తకృతి. దీనికర్త.

## కందుకూరి రుద్రకవి.

ఈతఁడు విశ్వబ్రాహ్మణ వంశ్యుఁడు. కందుకూరికిఁ జేరువనే పాలేటియొడ్డున గల చింతలపాలె మను గ్రామ మీతని యూరు. ఆయూరనే తద్వంశ్యు లిప్పటికిని గలరు.

రుద్రకవి మూలమున నావంశమువారికి 'కవివారు' అని యుపనామ మేర్పడినది. ఆవంశమున రుద్రకవికిఁ దర్వాతఁ బలువురు రుద్రకవినామకు లుండిరి. తొలుతటి రుద్రకవి కృష్ణదేవరాయల యాస్థానమున నష్టదిగ్గజములనఁబడు కవు లెనమండుగురిలో నొక్కఁడుగా నుండెనట*మల్కిబ్రహీంకాలమునఁ గూడ నొక రుద్రకవియుండెను. ఇబ్రహీంకాలమునఁగల రుద్రకవియే కృష్ణరాయలకాలమున బాలుఁడుగా నుండఁబోలును. చింతలపాలెమనుగ్రామమును మల్కిబ్రహీంప్రభువే రుద్రకవి కొసఁగెను.

అద్యాశీతిచతుశ్శతాధిక సహస్రంవై శకాబ్దాగతాః
అస్మిన్ శ్రీజయవత్సరే జయతిథౌ మాసేచమాఘేతథా
పంచమ్యాం ద్వయతింత్రిణీ జనపదం రుద్రస్యవిద్వత్కవేః
ప్రీత్యాశ్రీయిభరామభూపతిరదాత్ క్షోణీధరాఖండలః॥

ఇబ్రహీం ప్రభువిచ్చిన యగ్రహారమును నిన్న మొన్నఁటిదాఁక, తద్వంశ్యులే యనుభవించుచుండిరి.

సుగ్రీవ విజయము రచించిన రుద్రకవియే నిరంకుశోపాఖ్యానమని గ్రంథాంతరము రచియించెను. రెండుగ్రంథములందును గర్తకు కందుకూరు జనార్దన భక్తత్వము, పెదలింగనార్యపుత్త్రత్వము గలదు గావున రెండుగ్రంథములు నొక్కనివే యగుటస్పష్టము. నిరంకుశోపాఖ్యానమున,

* రుద్రకవి విషయమును చాటుపద్యమణిమంజరి ద్వితీయభాగమునఁ జూచునది.

"చేరి కన్నడభూమి చెలువట్టుపాశ్చాత్య
నృపతికైనను కొంతకృపదలిర్చు.

అని సీసచరణ మున్నది. అది విద్యానగరమును మరుష్కులు కొల్లఁగొట్టిన దుస్సందర్భమును దెలుపుచున్నది. విద్యానగర వినాశనము క్రీ. శ. 1568 నాఁడు జరిగినది. కావున నిరంకుశో పాఖ్యానరచన మటుతరువాత జరగినదగును. అప్పకవీయమున వినుకొండలో గుంటుపల్లిభాస్కరయగారి సముఖమున కందు కూరి రుద్రకవి కవితాచర్చ జరపినట్లు కలదు. మనరుద్రకవి యాతఁ డగునేమో! నిరంకుశోపాఖ్యాన సుగ్రీవవిజయకర్త క్రీ. శ. 1568 ప్రాంతములవాఁడేని, కొంతతర్వాతివాఁడేని కాఁ గలఁడు. దక్షిణదేశమం దల్పముగా నాంధ్రదేశమం దధికము గా యక్షగానములరచనములు, ప్రయోగములు సాగుచుండిన కాలమది.

## సుగ్రీవవిజయము.

శ్రీమద్రామాయణమునఁ గల కథాఖండములలో సుగ్రీవవిజయకథ యొక కండపట్టు. అత్యల్పకాలమున వడివడిగా గంటలలో నడచిన యీకథపట్టు రామలక్ష్మణులు, హనుమం తుడు, సుగ్రీవుఁడు, వాలి, అంగదుఁడు, తార అను కథాపాత్ర ముల శీలపు మేలిమినొఱసిమెఱుఁగు తఱుఁగులు చూపిన యొఱ గల్లనఁ దగినది.

తెలుఁగున గుత్తైనదీవిరామాయణాదు లగు రామాయణ గేయకృతులలో నీసుగ్రీవవిజయపుఁ గథపట్టు చాలహృద్యరచనములతో నున్నది.

ఎంతపనిచేసితివి రామా ! నిన్ను
నేమఁదందును సార్వభౌమా !
చెంతకిటు రాలేక చెట్లలో దాఁగుండి
వింతమృగమునుగొట్టు విధమాయెనా బ్రదుకు !

ఇత్యాదిగేయములను పలువురు పాడుచుందురు.

ఈగుదరికవి సుగ్రీవవిజయమునుగూడ స్త్రీ, వృద్ధ, పామరాదులు పలువురు పాడుచుందురట ! ఆయాపాత్రముల పాటలు తత్తద్వేషధారులు వచ్చిపాడునట్లును తక్కిన సంధివచనాదులు ఒక్కరిద్దఱు సూత్రధారప్రాయులు పఠించునట్లును, నీసుగ్రీవవిజయము వీథియాటఁగా నాడబడుచుండెడిది. ప్రాచీన సంస్కృతనాటకరచయితలు భాసభవభూత్యాదు లీ సుగ్రీవ విజయౌచిత్యమును దమనాటకములలో విమర్శించిరి. శ్రీరాముని శీలమును శ్రీవాల్మీకి రామాయణ పద్ధతిని సమర్థించిరి.

---

" కీర్తింతురవ్వానికీర్తి గంధర్వులు - గాంధర్వమునఁ యక్షగానసరణి - భీమఖం. 3 ఆశ్వా. శ్రీనాథుని కాలమున యక్షగానములు ప్రబలియుండుట దీనిచేఁ దెలియనగును. దీని పీఠిక 8 వ పుటలో పుట్‌నోటులో చేర్చుకొనునది.

భవభూతి "యద్వా కౌశల మింద్రసూనదమనే తత్రాపి పృథ్విష్ఠో జనః" యని దీని యౌచిత్యము నించుక చెనకెను. మసరుద్రకవి సంస్కృతాంధ్ర రామాయణకవులు త్రొక్కిన త్రోవనే త్రొక్కెనుగాని, యపూర్వకల్పనాంశము నేమాత్రము నిందు జేర్పలేదు.

ఆ యాపాత్రములు ప్రసిద్ధ రామాయణములలో నట్టి యుక్తిప్రత్యుక్తులు గలవిగా చిత్రములయ్యెనో ఇందు నటేటీరు గలదు. కాని యిది దేశిరచనముతో గేయరూపమాననుండుట విశేషము. ఇందీక్రింది గేయరచనలు ప్రశస్తములయినవి!.

హా సతీమణి ధర్మచారిణి హా గుణోన్నత జనకసుత నను
బాసిపోయితి వింతలోనే పద్మనయన
లేటిమాయలు మదినిదెలియగ లేక పాపపురక్కసునిచే
జాటి నిను గోల్పోతి నిక నాకేటిబ్రదుకు !

*　　*　　*

లలన నినుగలనైన బాయగగలన నీవిటలేకయుండిన
జలన మొందెను నాదు హృదయము జలజనయన !

*　　*　　*

తరణికులమున బుట్టి శరచాపములబట్టి
తరుణి గోల్పడు కంటె మరణమే మేలు
నను శౌర్యవంతుడని తనపుత్రి నిడినట్టి
జనకవిభుడీవార్తవిని నగవకున్నే.

*　　*　　*

నాయ మెఱుఁగక చంపితివి నరనాథ పాపముగట్టికొంటివి
బోయవింతిమె కాక నీవొక భూమిపతివా ?

*    *    *

శ్రీరామ నీరామఁ జెఱఁగొన్న రావణుని
వారిధులముంచితిని వాలమునఁ జుట్టి
ఒకమాట నాకుఁ జెప్పకపోయితివిగాక
సకల దైత్యుల నుర్ని జానకిని దేనె ?

*    *    *

ఆలిఁ జెఱఁగొనిపోయినట్టిదశాస్యుఁడుండగ నిర్నిమిత్తము
వాలి నేటికిఁ జంపితివి రఘువంశతిలకా !
ఇట్టి సాహసకర్మ మెచటికి నేఁగె భరతుఁడు సీమ వెడలఁగఁ
గొట్టి రాజ్యము పుచ్చుకొన్నాడఁ గువలయేశా !
నాయమేటికిఁ దప్పితివి రఘునాథ జానకితోడనే చెఱఁ
బోయెనే నీరాజనీతియు భూరిమతియుఁ.

*    *    *

శ్రీరామచంద్రమూర్తి చెట్టుచాటుననుండి వాలిమేనఁ గాఁడనేసిన వాఁడిములుకులకంటె, నిక్కడ తార ప్రత్యక్షమై నిలుచుండి శ్రీరాముని యంతరంగము నుచ్చిపోవునట్టు ప్రయోగించిన పలుకుములుకులు క్రొవ్వాఁడిగలవి.

ఈలఘుకృతి వీరకరుణరసభరితము. నీతిహృద్యము. స్త్రీ బాల, పామరాదులు గూడ పఠింపఁదగినది.

ఈ యక్షగానమున నీక్రింది దేశిరచనలున్నవి. త్రిపుట, జంపె, కుఱుచజంపె, అర్ధచంద్రికలు, ఆటతాళము, ఏకతాళము, ద్విపదలు, ధవళములు, ఏలలు. అర్ధచంద్రికలు త్రిపుటాదిరచనల ఖండరచనలు గాఁబోలును. ఇందలియర్ధచంద్రికలెల్ల నొక్కతెఱఁగునడకగలవిగాక భిన్నగతులతోనున్నవి. సంగీతతాళలక్షణము తెలిసికొనవారు వానిప్రభేదములు గుర్తింపవలెను.

కురవంజులు,యక్షగానములు నింకను మంచిరచనములు గలవి కొన్నియున్నవి. అవియేవేని యీ సుగ్రీవవిజయమువలె సుముద్రితములైనచో ఆంధ్రమధురకవితావిశేషములను సహృదయు లింక నధికముగా నాస్వాదింపఁ గల్గుదురు.

ఆంధ్రవాఙ్మయమున విలువగల యక్షగానవిభాగమున సుప్రఖ్యాతమగు నీరుద్రకవి సుగ్రీవవిజయమును శ్రీకపిలేశ్వరపురాధిపతులు, సాహిత్యవినోదులు, శ్రీ బలుసు బుచ్చిసర్వారాయప్రభువులు చక్కఁగా ముద్రింపించి యాంధ్రభాషాసాహిత్యవేత్తలకు వేడుకఁగూర్చిరి. ఇంకను వీ రిట్టిసత్కృతులఁ బ్రకటింప సర్వేశ్వరుఁ డనుగ్రహించుఁగాక.

మద్రాసు,
బహుధాన్యమహాశివరాత్రి.

వే. ప్ర.

# సుగ్రీవ విజయము.



ఉ. శ్రీవిభుఁ గొల్చి శంకరుఁ భజించి చతుర్ముఖు నెంచి భార్గవి[1]
గ్రావసుతా సరస్వతులఁ బ్రార్థన సేసి గణేశ పాదపూ
జావిధి సల్పి దేశికుల సన్నుత[2]నంబొనరించి కావ్యని
ర్మా[3]తృకుల [4]నుతించి కవితాజడుల న్నిరసించి చేసెదన్.[5]

వ. అని కవీశ్వరుండు కృతీశ్వరుండగు [6]కంబుకూరిజనార్దనస్వామి
నే మని [7]కొనియాడుచున్నాఁడు.

త్రిపుట.[8]

లలితగాత్రుఁడు శుభచరిత్రుఁడు దళితశత్రుఁడు సుజనమిత్రుఁడు
నలిననేత్రుఁడు కంబుకూరిజనార్దనుండు.

ఇందిరార్యుఁడు సాధువ[9]ర్యుఁడు పృథులశౌర్యుఁడు మేరు
ధైర్యుఁడు నందితార్యుఁడు కంబుకూరిజనార్దనుండు.

ధృతివిశాలుఁడు గానలోలుఁడు దివిజపాలుఁడు ధర్మశీలుఁడు
[10]నతదయాళుఁడు కంబుకూరి జనార్దనుండు[11]

---

1 వారిధి. 2 గ. మొప్పఁగఁజేసి. 3 గ. ఘ విధులకున్. 4 జ ఝ. గణించి. 5 చ కావ్యసగ్రాభవుల నాదిసత్కవులఁ బ్రార్థనజేసి నుతించి చేసెదన్ 6 క. ఆశ్రితజనపోషకుండైన 7 ఖ. ఘ. జ. ఝ కీర్తింపుచున్నాఁడు 8 చ. ఆహిరిరాగం 9 గ. చర్యుఁడు 10 ఛ. నుత 11 చ. జ. ఝ లలో నీ చరణము రెండవదిగా నున్నది.

వ. అని మఱియు[1] నద్దేవతాసార్వభౌమునకు[2] షష్ఠ్యంతంబులు సెప్పిన విధం బెటువలెను.[3]

అర్ధచంద్రికలు[4]

చదువులుదెచ్చిన జలచరపతికిన్
కుధరము మోచిన కూర్మంబునకున్
మేదిని దాల్చిన యాదికిటికిన్
కనకకశిపుఁ దునిమిన నరహరికిన్
బలినణఁచిన మాయలవడుగునకున్
మనుజేశులఁ గొట్టిన రామునకున్
[5]రావణుఁ [6]జంపిన రఘువర్యునకున్
[7]భానుజుఁ [8]గూల్చిన బలభద్రునకున్[9]
దనుజసతులఁ దగిలిన బుద్ధునకున్
ఖలుల నణఁచంగల కల్కిమూర్తికిన్
సర్వము దానగు [10]జిష్ణునికిన్.

వ. అంకితముగా నాయొనర్పంబూనిన సుగ్రీవవిజయం బను యక్షగానంబునకుం గథాక్రమం బెట్టిదనిన.[11]

1 క. ఖ గ. ఘ. చ. ఛ. జ. సన్నుతించి 2 చఛ. ఝ. యా దేవునకు 3 సెప్పినట యెటువలెను. (అన్నిటియందును) 4 చ. సౌరాష్ట్రరాగం 5 క. గ. సేతువుగట్టిన సీతాపతికిన్ 6 జ. గూల్చిన 7 జ. భావజు 8 గ. గొల్చిన 9 దీని పిదప, గ. గోవులఁగాచిన గోపాలునకున్ 10 క. గ. చ. చక్రాస్త్రునకున్ 11 ఖ. జ. క్రమంబెటువలె నుండెను.

సీ. శ్రీరామచంద్రుండు సీతామహాదేవిఁ
గానకంబున వెదకంగవచ్చి
పంపాసరోవరప్రాంత్యభూములయందు
సౌమిత్రియునుఁదాను సంచరింప
నావేళ సుగ్రీవుఁ [1]డధికసంభ్రమముతో
ఋష్యమూకమున వర్తించుచుండి
చూచి యా ఘనుల తేజోవి[2]శేషములకు
వెఱఁగంది మంత్రికోవిదు[3]న కనియె
వీరు [4]మనలను వధియింప వేషమొంది
వాలి పంపున వచ్చిన[5]వారు గాను
నాకుఁ గాన్పించుచున్నది గాకయున్నఁ
దాపసులకేల శరచాప[6]ధారణంబు.

వ. అని పలికి యచ్చోట నిలువంజాలక[7] భయపడుచున్న సుగ్రీవునితో[8] హనుమంతుం డేమనుచున్నాఁడు.

కపికులోత్తమ నాకుఁజూడఁగఁగపటవేషము గానరాదిది
విపుల పుణ్యులఁ బాపనుతు లని వెఱవనేలా.

---

1 చ. ఛ. డఖిలమంత్రులుఁదాను 2 ఘ. విలాసములకు 3 ఖ. ఛ కోవిదుల 4 క. ఖ. మనమును, గ. ఘ. చ. ఛ. మనముల 5 ఘ. వారివలెను 6 గ. ఘ. ఛ. ధారణములు 7 గ. చ. జ. నిలువశాకరింపక, ఛ. నిలువ సైరింపలేక 8 క. సుగ్రీవునిం జూచి.

(2) ఏల యిచటికి వచ్చిరో వీరెవ్వరో యీ రూపవంతులు
చాల [1]పరిశోధించి చూతము జడియ వలదు.[2]

(3) [3]రాజవంశ్యులు రాజతేజులు రాజపురుషులు రాజవీర్యులు
రాజసంబున నిటకు నేమిట రాఁగతంబో.

(4) ఈ మనోహరరూపవైఖరు లిట్టి తేజముఁ గలుగువారికి
భూమినెటువలె దుష్టగుణములు వొడమునయ్యా.

(5) ఏను నచటికిఁ బోయి వారల పూర్వికంతయుఁ దెలిసివచ్చెద
భానునందన వెఱవనేటికిఁ బంపు నన్ను.

(6) [4]నేర్పునను జని వారి రాకయు నియతవృత్తియు నిజముఁ
గల్గయు నేర్పరించెద [5]నుండుమిచ్చట వినతనూజా.

1 ఘ. చ. జ. ఝ. పరమరిసించిచూడక 2 క. యందు రెండు
మూఁడు చరణములకు మాఱుగా,
కపటమూర్తుల ఖలుల నప్పుడె గనగవచ్చును వీరలందును
కపటమించుకయైనఁ గానము కలుగనేలా.
3 ఖ. ఘ. చ. జ. ఝ లందు రెండు చరణములు మాత్రమే గలవు.
గ. యందైదవదియుఁ గలదు 4 గ. ఘ. ఛ.ల యందు కడపటిదగ,
పోఁడిమిగ నే వారితోడను పూర్వగుచ్చినరీతిఁ బలికియు
వేడుకలరగఁ దెలిసివచ్చెద నూరకుండు.
ఝలో.
హా త్రివీరులు చూడ సజ్జనవృత్తి నరసి యూరకె
తత్తరింతురె యరసిచూడక తపనతనయా.
5 క. వెఱవకుండుము.

వ. [1]అని పలికిన నీవుపోయి వారల వృత్తాంతం బంతయుఁ దెలిసి రమ్మని హనుమంతుని బంపి సుగ్రీవుండు దా నచ్చోట నుండ వెఱచి మలయాద్రికిఁ బోయె నట. హనుమంతుండు రామలక్ష్మణుల సన్నిధికి వచ్చి దండప్రణామంబులు [2]సేసి యేమనుచున్నాఁడు.:

త్రిపుట.

అయ్యా మీరలు రాజసుతులో యతులో తెలియఁగ రాదు సం
దియమయ్యె మునివేషములు నృపచిహ్నములు గలుగన్
ఏల యిచటికి వచ్చితిరి మీరెవ్వరెవ్వరు నెచట నుందురు
చాల మిముఁ గనుఁగొన్న [3]మాకాశ్చర్య మయ్యెన్.
వెంట నెవ్వరు లేక యీ మునివేషములతో నడవిలోపల
నొంటిఁ దిరుగఁగ నేమి కార్యం బొదవె మీకున్ [4]

1 ఝ. అనిన సుగ్రీవుండు హనుమంతుని వాక్యంబులు విని అయినను
2 ఝ. లాచరించి ముకుళితకరకమలుండై యేమనుచున్నాఁడు 3 క. ఖ. ఘ. జ. ఝ. మది కాశ్చర్య 4 క. ఖ. అనిపలికిన హనుమంతునిఁ జూచి లక్ష్మణునితో శ్రీరామచంద్రుం డేమనుచున్నాఁడు.

జంపె. వీనినమ్మఁగవచ్చు విశ్వాసపరుఁడౌట
వీనినమ్మఁగవచ్చు విశ్వంబులోను.
పుట్టు బ్రహ్మచారి భుజబలోన్నతశాలి
ఘనవజ్రపంజరము కంటె లక్ష్మణుఁడా.
మంచివాఁడగు వీఁడు మర్మజ్ఞుఁ డితఁడౌను
మన జానకిని దెలియ మతి యుత్తముండు.

వ. అనిన శ్రీరామచంద్రునితో హనుమంతుం డేమనుచున్నాఁడు.

ద్విపద. అని పల్కి వినయమొప్పారంగ నున్న
హనుమంతుఁ జూచి యిట్లనియె లక్ష్మణుఁడు.
వనచరవీర యిక్ష్వాకువంశమున
జనియించి లోకప్రశస్తుఁడైనట్టి
దశరథేశ్వరుఁడు మా తండ్రి యీ విమల
[1]యశుఁడు రాముఁడు లక్ష్మణాహ్వయుఁడేను
దండ్రి యానతిమీఁదఁ దాపస[2]వృత్తి
దండకాటవిలోన [3]ధరణిజ మేము
సంచరింపఁగ రామ జనపాలు దేవి
సంచిత చారిత్ర యగు సీత నెతు
కొనిపోయె దుష్ట[4]మూర్తుఁడు రావణుఁడు
మనమున నెంచక [5]మము డాఁగురించి.

---

త్రిపుట. (?) నాకూప్రఁస్నప్రుడె నాతల్లిదండ్రివని
నీపాదపద్మములు నే చేరి కొలుతుఁ.
నీవె నా గురుఁడవని నీవె నా దైవమని
నీవిపుడు నన్నేలు నిన్నెపుడు గొలుతుఁ.
అని పలుకు హనుమంతునితో లక్ష్మణుఁడేమనుచున్నాఁడు.

1 ఝ యశుఁడు రాముఁడు లక్ష్మణాఖ్యుండనేను 2 గ. క్రియల 3 ఝ. దావుగా మేము 4 గ. వర్తుఁడు, ఝ కొనిపోయె మమ్ముఁ దైకొనక రాఁణుఁడు 5 క. ఖ గ. మము మోసగించి, ఘ. ఛ. మనమున వెఱవక మమ్ము మొగఁగి ఝ మొరయుఁగలేక మమ్మును గను మొఁగి చ. మనమున సేవగింపగ మమ్ము మొగఁగి.

వాని [1]పోఁబడి ఘోరవనభూములందుఁ
బూనికఁ [2]దెలియంగఁ బూనియే తెంచి
కమనీయగుణపుష్పకబరి యా శబరి
సుమహితాత్మ్మఁ డటంచు సుగ్రీవుఁ జెప్ప
దానిచే నతని వృత్తాంత మంతయును
వీనుల కింపుగా విని యా కపీంద్రు
[3]నాదరంబున [4]నేలి యతని చిత్తంబు
[5]ఖేదమంతయు మాన్పఁ గృప పుట్టి యిటకు
వచ్చినవార [6]మెవ్వఁడవు మామదికి
[7]వచ్చియున్నవి నీ ప్రవర్తన లెన్ని
దెలియఁజెప్పుమటన్న దినకరవంశ
జలధీందునకుఁ గపిచంద్రుఁ డిట్లనియె [9]

జ. పె. [10]

ఇనవంశతిలక నేనినతనూభవు[11] మంత్రి
నవిలజుఁడు నాపేరు హనుమంతుఁడండ్రు.
కపులకెల్లనురాజు కార్యఖడ్గములకు[12]
నిపుణుఁడు సుగ్రీవుఁడపరిమితబలుఁడు
మేలు పొందఁగ నతని మీకు బాటుగఁ జేయ
నలినాప్తకులవ[13]ర్య నా చేతనౌర.

---

1 ఘ. ఝ. వెంబడి 2 ఘ. తెలియఁగఁ బోవనేతెంచి, ఝ తెలియక 3 ఘ. నాదరంబున నతని చిత్తంబునౌని 4 జ. జేరి 5 ఖ ఘోర 6 ఇ, ఘ. ఛ. మెవ్వఁడవీవు 7 క. ఖ. ఘ. ఛ. వచ్చియున్నది నీ ప్రవర్తనగాంత, ఝ వచ్చితి మనిచెప్పి వనచరుఁడవిటకు వచ్చితి నీ పేరు వర్తనముగాంత 8 జలధిచంద్రునకు, అని యన్నిప్రతులలో నున్నది 9 ఝ చంద్రుండుపలికె 10 చ. తైరవి 11 ఘ. జుని 12 ఖ. ఛ. లను, చ. లందు 13 క. ఛ. తిలక.

వ. [1]అనిన రాఘవేశ్వరుని చిత్తంబెఱింగి లక్ష్మణుఁడు హనుమం
తునితో నేమనుచున్నాఁడు.

జంపె [2]

శ్రీరామచంద్రుఁ డాశ్రితరక్షకుఁడు మేరు
ధీరుండు శూరుఁడు దివ్యాస్త్రవిదుఁడు
ఈ మహామహుని సేవ యెప్రొద్దుఁగావింతు
నేమటుక [3]బంటనై యేను గపివర్య
పూనికొని రఘురామభూపతికి సాధింప
రాని కార్యము లేదు త్రైలోక్యమునను
[4]ఐన రాజులు నోఁటి నరుగ ధర్మముగాదు
కాన రాముఁడు మిమ్ముఁ గైకొనఁగఁదలఁచెన్.

వ. అని పలికి నీవు పోయి గొబ్బునఁ గార్యంబు సమకూర్పు మని
పంపిన హనుమంతుండు శ్రీరామలక్ష్మణులకు మ్రొక్కి వీ
డ్కొనిన పిమ్మట నెటువలెను.[5]

ద్విపద. అనిలనందనుఁ డేగి యర్కతనూజుఁ
గని మ్రొక్కి పలికె నోకపికులాధీశ
ఆహా ధి [6]నీకు ననాయాసమునను
శ్రీరాముఁ డనెడి నిక్షేపంబు దొరకె

1 క. అనిపలికిన రామభద్రు 2 చ. కల్యాణి 3 చ. వర్తింతు నేను
4 ఈపాఠము ఘ. యందుమాత్రమే గలదు 5 క. ఖ. గ. ఘ. ఝ. మ్రొక్కి
చనునప్పు డెటువలెనండెను 6 క. నీ కనాయాసంబుకతన.

నింక నీయక్కఱలెల్లను దీఱ
గొంకక రఘురాముఁ గొల్వ మేతెంచి[1]
యనిన సుగ్రీవుండు హనుమంతుతో[2]డ
ననియె సంతసమంది యనఘ నీకతన
నలలితంబుగ రామచంద్రుని జూడఁ
గలిగె నాశోకాంధకారంబు వాసె
నాలస్యమేల చయ్యన ఋష్యమూక
శైలంబునకు రామజనపాలుఁ దోడి
తెమ్మన్న నేఁగి ధాత్రీపాలసుతుల
సమ్మతిఁ దోడ్కొని సరగ నేతెంచి
నికటస్థలంబున నిలిపి సుగ్రీవు
నకు విన్నవించిన నయమొప్ప నతఁడు
వచ్చి యారాఘవేశ్వరునకు మ్రొక్కి
మచ్చిక నతనిచే మన్నన ల్గాంచి
యమ్మహామహునిచే నగ్నిసాక్షిగను
నమ్మికల్గొని తాను నమ్మికలొసఁగి
గుహలోపలికి దోడుకొనిపోయి మున్ను
మహిపుత్రి యాకాశమార్గంబునందు

1 క. కొంకకు రఘురాము గొల్వ మేతెంచు ఘ. కొల్వకేతెమ్ము ఖ. కొల్వమేతెంచి జ. ఝ. గొల్వకేతెంచు 2 ఖ. ఘ. జూచి.

దనుజాధముండైన దశకంఠుఁ డెత్తు
కొనిపోవు నప్పుడా కుధరంబుమీఁద
వడి మూటగాఁ గట్టి వైచినయట్టి
తొడవులం గడుభక్తితోఁ గొంచు వచ్చి
యవనీశునకు నిచ్చి యవి వచ్చినట్టి
వివర మంతయుఁ దెల్ప విని మూర్ఛబోయి [1]
[2] యల్లనఁ దెలివొంది యాభూషణముల
నెల్ల నేర్పడఁ జూచి యెదనొత్తుకొనుచు.

వ. [3] అప్పుడు దుఃఖావేశంబున రామచంద్రుం డీవిధి శోకించు
చున్నాఁడు.

త్రిపుట [4]

(1) హా సతీమణి ధర్మచారిణి హా గుణోన్నత జనకసుత నను
బాసిపోయితి వింతలోనే పద్మనయన

(2) ఎంతభయపడి తల్లడించితొ నెంతయడలితొ యెంతబడలితొ
యింతి రావణుఁడెత్తుకొనిచన [5] నేమిసేతున్ [6]

(3) నన్ను [7] విడిచియు నిలువఁజాలక నాతివచ్చితి వడవిఁదిరుగను
నిన్ను విడియేనెట్టులోర్తును నీలవేణి

---

1 చ. బొంది(అ) 2 మెల్లనఁదెలిసి యా మెలఁత భూషణము, లెల్ల
3 ఘ. అంతట 4 చ. ఆహిరి 5 ఘ. చ. చనె 6 దీనిపిదప క. లో
ఓగుణాంబుధి పూర్ణచంద్రిక యోకృపాంబుధి మధనసన్నుత
ఓగుణోన్నత నీకు నన్విడిపోఁగదగునా
గ. నీకు నన్నెడబాయఁదగునా ఘ. నిన్నువాసి నే నోర్వఁగలనా
7 గ. ఘ. నీవుండఁజాలక.

(4) లేఁటి మాయలు మదిని దెలియఁగలేక పాపపురక్కసునిచే
బోఁటి నినుఁ గోల్పడితి నిఁక నాకేటిబ్రతుకు

(5) [1]ఇందుముఖి నినుఁ బాసినప్పుడె యేలపోకనునిలిచెఁ బ్రాణము
నిందలకుఁ బాలైతి ధరలో నిన్నుఁ బాసి
రమణిరో నినుఁ బాసినప్పుడె రాతిరే శివరాతిరాయెను
[2]నిముసమైనను నాకుఁ గంటికి నిదుర రాదు
పలుకుపలుకున నొలుకనమృతము పలుకనేర్చిన[3] జాణముద్దుల
కలికి చిలుకలకొలికి నిన్నెటఁ గందునోక్కా![4]
కూడఁ[5]జని యాకసిఁడిమృగమును గూల్చి చర్మముఁ దెచ్చి
నాఁడను, వేడుకలు [6]గనుఁగొనఁగనేరక వెఱ్ఱినైతి
లలన నినుఁ గలనైనఁ బాయఁగఁ గలన, నీ విట లేకయుండినఁ
జలనమొందెను నాదు హృదయము జలజనయనా
నన్ను నీ వెడఁబాయవెన్నఁడు నిన్ను నే నెడఁబాయఁజాలను
గన్నరో యీ వెతలు వచ్చెను గడవఁదగవే.

వ. [7]అని మఱియు[8] నేమనుచున్నాఁడు.[9]

---

1 క. లో ఈచరణములేదు 2 క. గుదులుకొను బాపమున కంటికి నిదురరాదు 3 ఘ. ముద్దుగుమ్మవు 4 ఘ. నెన్నడు గందునయ్యో. 5 క. ఘ. కూడదన్నా 6 క. చెల్లింపనేరక ఘ. విహరించనేరక 7 అప్పుడు 8 క. ఖ. ఘ. మరిన్నే మనుచున్నాఁడు 9 చ. లో మొదటి రెండుచరణములు మాత్రమే యున్నవి ఘ. లో 4, 9, 10 చరణములులేవు

జంపె.

తరణికులమునఁ బుట్టి శరచాపములు పట్టి
తరుణిఁ గోల్పడ కంటె మరణమే మేలు
నను[1]శౌర్యవంతుఁడని తనపుత్రి [2]నిడినట్టి
జనకవిభుఁ డీవార్త విని వగవకున్నె
ఒకట నొచ్చుము లేకయున్న రవివంశమున
కకట నాచే నింత యపకీర్తి వచ్చెన్

వ. అనిపలికి [3]రాఘవేశ్వరుం డెటువలె నుండెను.

అర్థచంద్రికలు.

కన్నుల నశ్రులు గ్రమ్మఁగ వగచున్
ఔరా విధివశ మని తల యూఁచున్
ఏటికి ప్రాణము లిఁక నని తలఁచున్
క్రమ్మఱ సొమ్ములు రొమ్మున నొత్తున్
[4]ఏగతి నోరుతు నిఁక నని పలుకున్
[5]బాపురె విధి యని ఫాలము గొట్టున్.[6]

---

1 గ. ఛ. శార్య 2 క. నిచ్చిన 3 ఘ. ఙ. అనిమతిన్నెటువలెనుండెను చ. రామచంద్రుండెటువలెనుండెను ఖ. ఘ. ఝ. లలో నీవచనములేదు 4 క. ఏగతి నోపుదు నిపుడని 5 ఖ. ఘ. ఛ. లలో నీచరణములేదు 6 దీనిపిదప క. ఖ. లలో,

ఏమే జానకి యెందుబోతివో గదా యేమంటినే నిన్ను నో
భామారత్నమ యోర్వఁజాలగదవే ప్రాణంబు నీకిత్తునే

